"Andhra Vyasa Bharata" Series No. 3.

# VIDULA

(The Romantic Story of a Kshatriya lady)

A Selection of Verses from Andhra Vyasa Bharata Navaneetham.



**Akundi Vyasa Moorty Sastrulu Garu**

The late Senior Sanskrit Pandit of the Govt. Arts College, Rajahmundry.



[A Reprint from "Hindu Sundari" Cocanada]

Published by

A VENKATA SASTRI

Pandit, The Madras Seva Sadan High School, Kilpauk P.O. Madras

 1932 [Price 0-2-0

# ఉపోద్ఘాతము.



విదులాపుత్రసంవాదము భారతనవనీతమందలి యొకయుపాఖ్యానము. దౌత్యభంగానంతరమునఁ దన్నుఁజూడవచ్చిన కృష్ణునితోఁ గుంతి 'నాకొడుకుల కియ్యదివినిపించి పౌరుషముగలిగి జీవింపుఁడని తెలుపుమా'యని చెప్పినసందర్భమున సంస్కృతభారతముననున్నది. ఇందు వీరవనితయగు విదుల శత్రుపరాభూతుఁడయి డాఁగియున్న తనసుతుని సంజయుఁడనువానిని ప్రేరేపించి శత్రువులపైకి యుద్ధమున కంపుట యిందలికథ. ఈభాగము తిక్కనకవిబ్రహ్మ సూచించి, యేకారణముచేతనో వదలినాఁడు.

'భారతనవనీత'మనుపేర కీర్తిశేషులగు బ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులవారు సంస్కృతభారతమును దెనిఁగించినారు. ఈవిదులాచరిత్ర యీయాంధ్రీకరణమందలిది. 'వ్యాసభారతము' సంస్కృతమునందున్నట్లే తెనుఁగునఁగూడరచించి సార్థకముచేసినారు. గ్రంథమంతయు సిద్ధముగానున్నది. కాని ముద్రితముకాకుండుటచే నున్నట్లే యెవరికిని దెలియనిస్థితిలోనున్నది. శ్రీవ్యాసమూర్తిశాస్త్రిగారి పాండితీప్రతిభాదులు లోకవిదితములు. ఆయననుగూర్చి వ్రాయనవసరములేదు. ఈగ్రంథము చాలభాగము యథామాతృకముగా నున్నది. పాఠకులు ప్రతిపద్యాంతమునందు జాగ్రత్తతో నన్వయమార్గము చూచుకొనుచుండఁదగు నూత్నఫణితిలో నీగ్రంథము రచింపఁబడినది. వెనుక పద్యములోని కడపటిపద్యములు, ముందు పద్యములోనికో, ముందుపద్యములోని మొదటిపదములు వెనుకటి పద్యములోనికో చొచ్చుకొనియుండుట మెండు. దానిని బరిశీలించుకొనుచు, పాఠకులును విద్యార్థులునుజదివి యిందలి భాషారీతులవలనను, భావములవలనను, గథాంశములవలనను గనిసి చక్కనివైదుష్యమలవరించుకొందురుగాక!

ఇట్లు:
విద్వద్విధేయుఁడు,

పిఠాపురము,
1—8—32.

విద్వాన్ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి,
Pandit, Telugu Lexicon Office, Pithapuram.



శ్రీయుత విద్వాన్

వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు

వ్రాసిన టిప్పణము యిందు కడపట చేర్చబడినది.

—ఆకుండి వేంకటశాస్త్రి.



# ఏ డు ల.

శ్రీకృష్ణుఁడు దుర్యోధనునికడకు రాయబారిగ నేగి రాయబారము నెఱపి పాండవులకడకు పోవుటకుముందు కుంతి యనుజ్ఞ గొన నేగుట.

తే॥ గీ॥ సంనిహితమయ్యెఁ గాలమీ సర్వమునకు
ధార్తరాష్ట్రునిగతి, నీదుతనయులకడ
కేగెదన్వడి, సెలవిడు మేదినీవు
చెప్పితనివిన్తు ఘనవిదుషీ! తెలుపుము. (1)

మ॥ పలికెన్గుంతి యుధిష్ఠిరున్నృపు నావాక్యంబు శ్రీకృష్ణయూ
గలితంబెంతయు నీదునీతివిఫలం గావింపకోపుత్ర! ప్రాఁ
బలుకుల్పారముసేయువాని మతిరేవన్ధర్మమే యొక్కఁడు
న్దలఁతంభోజభవుండు బాహువులక్షత్త్రంబు నృజియించెన్మనన్ (2)

ఉ॥ క్రూరపుఁగర్జము ల్సలిపి, క్షోణిజనమ్ములఁగావ భూధవా
చారము విన్ము మున్నిడె రపన్ముచికుందునకు న్గుబేరుఁడా
వీరుఁడు గోరుచున్ధరణి విక్రమపర్జిత నేలనేఁగొన
న్ధారణినన్మవింతపడెఁ దానెజితన్ధరనేలెఁ జక్కఁగన్. (3)

మత్తకోకిల॥ ఆ మహీపతి రక్షితల్ప్రజ లాచరించినపాడిలో
భూమినాథుఁడు తుర్యమంశముఁ బొందు, ధర్మమధర్మము
న్సామిఁజేయును స్వర్గనారక సౌఖ్యయాతనలొంద భూ
స్వామి చక్కఁగ నేలినం గృతసంజ్ఞమూ యుగమయ్యెడిన్. (4)

తే॥ గీ॥ కాలమేలికఁ జేయునో, కాలమునకుఁ
గారణమొ రాజో యనికొంకఁ గాదు రాజె
కాలమునకగు హేతువు, చాలుఁ గృతముఁ
త్రేతద్వాపరకలుల భూత్రాతసేయ. (5)

ఆ॥ గీ॥ త్రిదివసుఖమొసంగుఁ గృతకారి నృపతికిఁ
ద్రిదివసుఖ మొదవదు త్రేతఁ జేయు
ధారిణీశ్వరునకు, ద్వాపరకారిత
త్క్షామము ననుభవించుఁ గలివిధాయి. (6)

మ॥ కడుఁ బాపంబెనయు, న్ధరాధిపతి దుష్కర్ముండు పెక్కేండ్లు సెం
దెడుఁ దీవ్రవ్యథ యామ్యలోకమున ధాత్రీనాథు దోషమ్మునం
బడుదుఃఖంబు జగంబు, చెందు వెతభూపాలుండు పాపంబుపా
ల్పడలోకం, బిది పూర్వరాజకృతమా ప్రారంభమే చూడుమా. (7)

ఉ॥ భీతుఁడు హింసకు న్బ్రజలఁ బెంచిన పున్నముఁ జెందునే మహీ
త్రాతవుగాఁ దలంచిరి పితామహుడుంబిత యజ్ఞదాన వి
ఖ్యాతివహింపఁ గోరితి ధరాధిపతిన్నను నేను, నీశ్వర
ధ్యాతలు తల్లిదండ్రులును దైవతముల్ ల్నుతులొందఁ బుత్రులన్ (8)

తే॥ గీ॥ ధనముదీర్ఘాయువును, ప్రజావనమొనర్పఁ
బున్నెమో పాపమో యిది పుట్టుతోడఁ
గాంచితి, వవృత్తి దుఃఖముగనకుమయ్య
శూరుడానపతిం జేరి క్షుద్వ్యథితులు (9)

తే॥ గీ॥ కని తనిసిపోదు, రింతకు ఘనము సుకృత
మేది, పుణ్యుఁడు దొరయాచు నీవివశుల
గొందఱుంబల్మిఁ గొందఱు నందఱు బుత
హితవచనముల నొనరించుఁ గృతినిపుణత. (10)

ఆ॥ గీ॥ బిచ్చమెత్తవలయు విప్రుఁడు, క్షత్త్రియుఁ
డేలవలయును, గడియింపవలయు
వైశ్యుడర్థములనువారిఁ గొలువవలె
శూద్రుఁ డన్యవృత్తిఁ జూడకుగాన. (11)

ఆ॥ గీ॥ క్షత్త్రియుఁడవు గావు క్షతులను బలులచే
మనుము భుజబలమునఁ గనుకులీన
వృత్తముద్ధరింపు పితృభాగ మరిహృత
మును వెరవెదియేని పూనిపుత్త్రి. (12)

చ॥ నినుఁగని మిత్త్రినందనుని నెచ్చెలులంబెడఁ బాసి యన్యునో
దనమును వేతునింతకు వెతంగన నభ్యధికంబు, పెద్దల
న్మనుఁగనొనర్ప, కాయుధము పూనుము, పోరుము పుణ్యహీనుఁడై
యనుజులు నీవు పాపగతి నందకు పుత్త్రిని సింధురాజుచేన్. (13)

## —* విదులోపాఖ్యానము *—

తే॥ గీ॥ బన్నముం జెందిడీనుఁ బరున్నవాని
విదులనిందించె క్షత్త్రియ విదితరాజ
సభలఁ దండ్రికి నాకును జాతుఁడీవు
కావు, వచ్చితి శత్రుహర్షావహుఁడవు. (14)

ఉ॥ ఎచ్చటనుండియో, పురుషుఁ డెన్నఁదగండనహంయుఁ డెన్నఁడే
న్వచ్చునె మేలు నీకు భరవాహుఁడు గమ్ము దనుందృణంబుగా
నిచ్చదలంప, కల్పమునవే తలపోయకు పొట్టసింపమే
లెచ్చఁదలంచి, మానివెఱ, నేడ్తెఱలెమ్ము పరాజితుండవై. (15)

తే॥ గీ॥ కుజన! యిట్లుపరుండకు గుందవిందు
లెల్లఁ బగతురు సంతసమోనయు, మాన
హీన! నింఘను జడిసెలమేలు, మూషి
కాంజలిసుపూర సులఁతికి హర్షమెసఁగు. (16)

మ॥ అణుమాత్రమ్మున నే, మనందగున సర్పాశీర్ష్మాతి స్గుక్కయ
ట్లణఁగన్రాదు పరాక్రమింపుమయిన న్ప్రాణమ్ములన్నందియుం
బణుజట్లుల్గనుమీ యరాతియన రప్రాణప్రకారంబుతో
నణఁగార, బయిఁ బడ్డయట్లుపిడు, గస్తాప్తుండుగా, కాసతోన్. (17)

చ॥ విదితమొనర్చి పౌరుషము విశ్రుతిఁగాంచుము, కోరుమెన్నఁగా
మొదటనె నిన్ను, నడ్మఁగడబొందఁ దలంపకు మెన్నికన్నరిటి
న్నుదకు వెలుంగుగాలిచిన తుమ్మికి యట్లదె మేలుతేనికి
న్మృదువుజనింపరాదు సుతుఁడెవ్వనికిన్ బుణమీఁగు శూరతన్ (18

మ॥ తనునిందింపఁడు సిద్ధ్యసిద్ధులకుఁ జింతంజెందఁ డార్యుండు జీ
వనతృష్ణంగనఁ డాక్రమింపుమరి దేవత్వంబు నేఁజెందునా
యన, ధర్మంబు పురస్కరించి మనసేలా సత్క్రియల్గీర్తియ
య్యె నశేషమ్ములు నీకధృష్ట! సుఖిగా హేతుల్గన న్మనిక్కికిన్. (19)

మ॥ ఫలమేమీ, పడుచున్గొనవ్వలెరిపుం బాదమ్మునన్పృగ్నము
న్కులమున్నీవు గతంబుగా నిలుప నీకుంగర్జ, మెవ్వాఁడుమ
ర్త్యులచే మెప్పుగొనండు (రాశిపెనుపే) యుక్తంబుగా దెన్నఁగా
నెలఁతన్పూరుషు వానిఁగీర్తిఁ గనఁడేసి స్వదృసత్యమ్మునన్. (20)

ఉ॥ దానతపోర్థలాభములఁ దల్లికిఁ గాల్మడి వాఁడు శ్రీతపో
నూనుఁడె పూరుషుండు, గృశు నెవ్వనివారలుమెత్తు, రిట్టిఁడె
వ్వానికి విందుగాఁగు సుఖివాఁడు స్వదేశముఁ బాపెఁ బొట్టకుం
గానమ, యిట్టిబద్ధకము గల్గినవాఁడు జనింపకుండుతన్. (21)

తే॥ గీ॥ పడఁతి కెవతికిఁ బొగయకు, పశ్చివ్వలింపు
మణెమి శతుృలఁ జంపు, మత్యల్పకాల
మేనివైరుల తలవెల్గు మెంతదనుకఁ
గినుకఁ గలడంతదనుక నేమనుజగణన. (22)

ఉ॥ పొందనివాఁడు గోపమును బూరుషుఁ డంగనగాఁడు; సంతసం
బందుటసాకతాన, సిరిహానియవు, న్జెడురెండులోకము
ల్నొందఁడయేని యుద్యమము, సేవ్య్య డనీహుఁడు గాఁడువీడు మీ
మందులమ్రిందఁజేయ మ్రిదిమమ్ము మదిన్సహాజంబు పుత్త్రికా. (23)

క॥ పురుషుండనవచ్చునె సుం
దరిఁబోలె న్మనెడువాని, దళితవిపత్కుం
డరిగిన దివికిం గందురు
పరిపూర్ణసుఖంబు దేశ వా*స్తవ్యులకున్. (24)

క॥ తనసుగమువిడిచి గడియిం
చినసిరి, దొరయవును సరఁగ జెలులకు సంమో
దనుఁడనఁ దనయుండనె
ననుఁగనవే నీకేలనేల కలిమితోడవ్రులున్. (25)

తే॥ గీ॥ ఆదరింపఁబడని వారలందు లోక
ములవుఁ గావుత నీశతుృవులకు నాదృ
తాత్మల భువనములు మనయనుఁగుఁజెలులు
చెందుదురుగాక సంజయ! చెలులమనుపు. (26)

తే॥ గీ॥ ఘోలిబ్రితుకకసత్త్వలఁ బోష్యహీను
లను బరాన్నోపజీవుల ననుసరించి
నిన్నుమందురుగాక భూసిగ్జరుల మ
రులు మఘువుఁ బోలె భూతముల్జలధరువలె. (27)

పాఠాంతరము—*సిమనుజులేన్

మ॥ ఫలవృక్షమ్మును బోలె నేనరుని సర్వప్రాణులుఞ్జేరియి
ప్పాలయుస్స్వాదులమోదపూర్ణులను జేయు, న్వీరుఁ డెవ్వాఁడు బా
హుల బల్మిన్ననుమించి యెల్లరను వాఁడొందున్మహీజాని యీ
యిలఁగీర్తి, న్బడిమేను స్వర్గసుఖము, న్స్థానుండ విపట్టునన్. (28)

క॥ చీరమువీడిన సౌదుప్ర
భారమణుసి జీవితాశఁ బాడువనివానిం
జోరుడందురు, సద్వ్యా
హారముఁ గొనవీవనాయు వౌషధమువలెన్. (29)

ఉ॥ చెందరు సింధురాజుపయిఁ జెల్మిజనుల్బల హానిఁగోరుచుం
గొందల మున్నవారు, గనుఁగొంచును నీబల ముద్యమింతుక
ప్పంగము మైత్రిముం జలిపి వారలతో గిరిదుర్గమందుగీ
డొందిన యప్పుడే పగతుఁ డోరిచి సంజయ! సార్థనామతన్. (30)

శా॥ సంపాదింపుము నీదుబాల్యమున సజ్జ్ఞానుండు వృద్ధుండనె
న్నంపన్నుండగు నీఁడు వెండియును గృచ్ఛంబెంతయో చెంది మర్త్య
సంపూర్ణాశఁ దలంచు చాపచనముం గ్రాక్షించుటన్నీజయం
బింపౌ సారెకు హెచ్చరించుట నిను న్హాళిష్టుల్పరులేవనికిన్. (31)

మ॥ గెలుపైన, న్నయవర్తివానికగు శ్రీకీర్తుల్ధ్రువంబబ్బిన
న్గలుములెల్లబరమైన పెద్దలదె భాగ్యమ్మంచు లెమ్మాజికె
చ్ఛెలుభర్త్రాత్మజ హత్యనెవ్వ, మృతి హెచ్చే దీనికిన్నె సము
జ్జ్వలమందుం గులమందుఁ బుట్టితిఁ బతింబ్రాపించితినీవ్వరునిన్ (32)

మ॥ మునుగన్నాఁ డవనర్ఘ మాల్యవసనమ్ముల్దాల్చి యిపొందున
న్ననుఁగుం జేడెలనడ్మ, నిష్పుడితినైన్య, న్సంజయా! నన్గటుం
బిని నత్యంతకృశాంగుల న్గనుచు జీవింపన్బలంబేమి యా
జనులన్నేవకుల న్బ్రోహితుల నస్మత్త్వక్తుల న్గానమిన్. (33)

మ॥ భరణంబున్మన నేలనీవు గనసే భార్యాస్వతు స్త్రీ సా
దరునిష్ఠున్మనుబోలె, నాహృదయసంతాపం బెటుల్మాయు భూ
సురునర్ధనియింప కంపిమననే క్షుద్రోత్తరమ్ము స్వాదీ
శ్వరుఁడున్నే మును విప్రువిప్పితిమొ, సేవ్యత్వంబె మాకెప్పుడున్. (34)

ఆ॥ గీ॥ ఒరునిబాగడియొఱుఁగ మొరుఁ జేరిమనపల
సినవిడిచెదనుసుఖు, మనుపుమన్ము
నృతులఁ దేపవగుచు నెనయాపుదరఁ గాపు
దిక్కుమాలినమము, నుక్కడంపక. (35)

సీ॥ పగఱనెల్లనుమనఁదగ, వొక్కపగతునే
నడఁపినసమగు నమరవిభుఁడు
వృత్రిగెల్పుటనె మహేంద్రుఁడయ్యెను,
భేరువాడిపిలువు కయ్యమాదరిపుల
సన్నద్ధులఁ బ్రసిద్ధుఁ జంపియశస్వివి,
గమ్మపుడేనతు గ్లానివార
లవుదురు, విడిమేనియూస,
పౌరన్దక్షుహీనులొానర్తు సమృద్ధిమంతు

తే॥ గీ॥ హతుఁడుచెందును సురలోకమందు సుగము
వైరివశుఁడైన నిలుపరు ప్రాణములను
రాజ్యమునురత్నముల, నమరపదమమృత
మట్టిరాజ్యము పరులపాలయ్యెఁ, బడుము. (36)

సీ॥ చిచ్చుఆపిడుగట్టు చెలఁగి శతృలపయిఁ
గనకుందుఁగాత నిన్ననుకడుప
పొంగుశత్రులకును బాక్కుమాబోట్లకు
నడుమ శౌపీరకన్యలఘునుపలె

లాలింపు స్వార్థముల న్నింధునారుల నగ
వులపాల్గాకు తగుకులమున
సొగసునవిగ్దె విశ్రుతుండవు నీయట్టి
డెగ్గువలెంబని నెలమిమొరుల
తే॥ గీ॥ కాచరించుటమిత్త్రియే, యరుల కిచ్చు
కమ్ములాడుచుఁ గొలుచు నిన్గనినశమము
నామదికినెట్లు, శత్త్రివినతి మనఁదగ
వేనెఱుగుదు క్షత్త్రియ మానసమును. (37)
సీ॥ వింటి బూర్వులును నవీనులును జెప్పఁగ
నిత్యము బ్రహ్మవినిర్మితంబు
క్షత్రియుఁ డవనికి సాధ్వసపడకెందుఁ
జరియించునది మదద్విరదమువలె
ధారిణీసురులకు ధర్మమునకు నెప్డు నతుఁ
డుగాదగును వర్ణములనన్య
ములనియమించుచుఁ గలుషకారులనంత
మందించునది మనినంతదనుక
తే॥ గీ॥ ననినఁబుత్త్రికుఁడనెఁ దల్లి యతికరినము
నీమనంబయోమయ మొక్కొ నిర్దయంబు
క్షత్త్రియాచారమార, నాజననివయ్యు
నన్నువలెనన్ను నంపెదవాలమునకు. (38)
తే॥ గీ॥ ఏకసుతవును బలికెద విట్టునన్ను
నేలనేఁ గనరానిచో నేలమొల్ల
నెమ్మి నగలును బ్రతుకునే నీకునయ్యుఁ
గడుసుతప్రియ వేమొకొ విడిచితినను. (39)

విదుల — తే॥ గీ॥ ధర్మమార్గము బుధుల కేదశను సాధ్య
ము లివి యారసి నాయనా పురికొలిపితి
నిన్ను, నిత్తఱి కర్జము నీవు విడిన
నప్రతిష్ఠుఁడవౌదు నేనాఁగకున్న. (40)

సీ॥ ఖరివలెనౌదు నిష్కారణవత్సల,
వదలుము మూఢులుపట్టుత్రోవ
నీవు సద్వృత్తుఁడవేని నేఁగూర్చెద
నీ, కసదాచారునిం గొమరుని
సైరించునరుఁడు ప్రజాఫలం బందఁడు
విహితపరిత్యాగు లహితకరులు
పడయరు సుగ మిహపరములఁ బాపు
పాధములు, సృజించె విధాత యనికి

తే॥ గీ॥ క్షత్రియుని, జయిసఖులతో సౌఖ్యమూదు
నదిదురాపము శత్రుగృహమున దివిసి
హతుఁడు సురపురినలరెడు నాత్మజుఁడనె
నోజనని! యిట్టుసెప్పకు మూరకుండు. (41)

కం॥ కొమరుఁడు నాపై దయ, నాఁ
బ్రిమదము సైంధవజయంబు భావిదలఁతు నీ
కమరం, గొమరుండనె, నో
యమ! కోశసహాయ రహితుఁ డుడు జయమొందుఁన్? (42)

కం॥ కనినాయవస్థ రాజ్య
మ్మునకు నిరాశుండఁ ద్రిదివమున కఘిమోలె
జ్జననీ! నీమతినాయ
ట్టెసికిగ్గనిన న్దైరువు నడిచెద నమ్ముమా. (43)

క॥ తనుజా! తొల్లిటిలేములఁ
దను నవమానించుకొనకు, ధనముదొరకకేఁ
చును, దొరకి యదృశ్యమునవుఁ
గినుకనె యెఱుకెడలి చనదు కృత్యమువోడఁగన్. (44)

ఆ॥ గీ॥ ఫలమనిత్యమెల్లపనులకుఁ దండ్రి! య
కర్తలెపుడు ఫలముగనరు, మున్నె
యెఱుఁగువాఁడు విఫలకృత్యుఁడు న్వగవఁడు
మిగుల, లెమ్ము, కడఁగు మేలుగొనుము. (45)

ఆ॥ గీ॥ గెలుతుననియె తలఁపు సిలిపి, వగందోలి
యెపుడు మంగళముల నెదుటనుంచి
పుడమివేలుపులను బూజించుచు బలాఢ్య
యుతుఁడు సుమతి నృపతి యెసఁగువేగ. (46)

క॥ వెలయించు లచ్చివాని
న్జలజాప్తుఁడు దూర్పువోలె సమకూర్పుము శ
త్రులపైఁ గ్రిద్దుల లుబ్ధులఁ
గలిమిదొలఁగినారి గర్వకలితుల రిపులన్. (47)

క॥ వడివీచుగాడ్పుమేఘ
మ్ములవలె నీవిధమున గణముల గూరిచి పె
క్కులఁ దొలుతవారికిడి ప్రియ
ములెపలుకు ప్రబుద్ధుఁడగుము. (48)

తే॥ గీ॥ వారు పగతుండెఱింగిన ధీరునిన్ను
వెఱచు, నపవాదముల ధన వృద్ధిఁబడయు
నాశ్రయింతురు నెచ్చెలు లరిసహాయు
నమ్ము, సంభావ్యమె దొరతనమ్మగునని. (49)

తే॥ గీ॥ వెఱవరాదే దశేన్ద్రియప్రదాంతుఁడు
భీతుఁడు స్ఫీతుఁ డట్లౌట నీతిగాదు
తలిస్తుఁగనిదొర, రాష్ట్రము దళము మంత్రు
లును భయాకులత న్బగతుని గొలుతురు. (50)

తే॥ గీ॥ పూజితుల్మిన్ను నెచ్చెలుల్ఖ్యాతికాము
లగుచు రాష్ట్రాభిమాని తనవసిభర్త
తోవగచుచుండ్రి, వెఱవఁగ నీవృవిడుతు
రేఁ బరీక్షించితిని దేజమెసఁగ నీకు. (51)

ఉ॥ నమ్మినసాధువాదినిని నన్నుసుబుద్ధునిగెల్వఁలెమ్ము, వి
త్తమ్మధికమ్ము నీకవిదితమ్మితరుల్గన, రేనెఱుంగుదు
న్నవ్వమ్మొనరింతునీకు వశవర్తులు సైఁచెడువారు గష్టము
న్నెమ్మిగలారువేల్గలరు నెచ్చెలులన్న సుతుండు హృష్టుఁడై. (52)

మ॥ పలికెందల్లి, భవిష్యదవృద్ధిఁగని, నన్భవ్యంపు మార్గమ్మున
న్మెలఁగం జేయఁగనీవు గల్గఁ దగు నే నీటన్దరస్నిల్ప, వే
ల్పులబోనంబునుబోసి నీనుడికిఁ దన్పుంజెంద నేనేగద
న్వెలయఁజ్జేయ నిదే విశదువిహారి స్వఖ్యాతి వీరప్రియా. (53)

సీ॥ వాక్పరతంత్రుఁడై వాఁడు సదశ్వమువలెఁ
దల్లియాజ్ఞసర్వ మొనరించె
నిదివిన్పఁదగు మంత్రినృపతి వైరిక్లిష్ట భ
యదము తేజోవివర్ధనంబు
నాలింపఁదగు నితిహాసమియ్యది జయనామ
కము జిగీషునరవరునకు
శత్రులమర్దించి క్షమనేలు శీఘ్రము, గర్భిణి
వీరునిఁ గాంచు సుసుతు
తే॥ గీ॥ పలుకు మగ్గునతో హరి! జలరుహాక్ష!
తెలిపెనశరీర నీపుట్టుదినమునందుఁ
గుంతి నీకొడుకు వీఁడు శక్రునకుఁ బురుషు
కలన నెల్లరఁ గురువుల గెలువఁ గలఁడు. (54)



శ్రీ॥ శే॥ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిలగారిచే రచింపఁబడిన "ఆంధ్రవ్యాస భారతనవనీతము" ఉద్యోగపర్వము: ద్వితీయాశ్వాసము నుండి గ్రహింపఁబడినది.



# లఘుటిప్పణము



1. ధార్తరాష్ట్రానుగతిని = కౌరవుల యనుగమనముతో:—అనగా—కౌరవులతోఁగూడ అని తాత్పర్యము. సెలవిడుము = అనుజ్ఞనిమ్ము, వినుతుౝ = వినిపింతును, విదుషి = పండితురాలు, (పుం. విద్వాంసుఁడు)

2. వినుపు = వినిపింపుము, ప్రాఁబలుకులు = వేదములు, పారముసేయువాఁడు = చదువువాఁడు, అంభోజభవుఁడు = తమ్మిచూలియగు బ్రహ్మ, క్షత్త్రము = క్షత్త్రియజాతిని.

3. కర్జము = కార్యము, భూధవుఁడు = రాజు, రసౝ = భూమిని, జితన్ = (తనచే) జయింపఁబడినదానిని.

4. రక్షితలు = కావఁబడినవారు, పాడి = ధర్మము, తుర్యము = నాలుగవది, స్వర్గనారకసౌఖ్యయాతనములు = స్వర్గసౌఖ్యమును, నరకబాధను, కృతసంజ్ఞము = కృతమను పేరుగలది.

6. కృతకారి = కృతయుగమును చేయువాఁడు (కృతయుగ ధర్మములతోఁ బాలించువాఁడు అని భావము) ఇట్లే, త్రేతఁజేయు ధారిణీశ్వరుఁడు, ద్వాపరకారి, కలివిధాయి, శబ్దములు. తత్క్షమము = దానికి తగినది.—ఇది పైపద్యముతో నన్వయించును.

7. యామ్యము = యమసంబంధమగునది, అనఁగా —యమునిది, పూర్వరాజకృతము = వెనుకటి రాజులచేఁజేయఁబడినది, ప్రారంభము = కార్యము.

8. హింసకుౝ = పరులను పీడించుటకు, భీతుఁడు = భయపడువాఁడు, మహీత్రాతవు = భూమిని రక్షించువాఁడవు, ధ్యాతలు = ధ్యానముచేయువారు.

9. ప్రజావనము = ప్రజలనురక్షించుట, అవృత్తి = వృత్తిలేనివాఁడు, (వృత్తి = 1. వర్తనము 2. జీవనము) క్షుద్వ్యథితులు = ఆఁకటిచే పీడనొందినవారు.

10. తనిసి = తృప్తినొంది, ఋతము = సత్యము, కృతినిపుణత = పనియందలి నేర్పు.

12. క్షతులను = కొట్టఁబడినవారిని, బలులు = బలవంతులు, కులీనవృత్తము = వంశచరిత్రము, ఉద్ధరింపుము = కొనుము, వెరవు = ఉపాయము,

13. అన్యుని + ఓదనము = ఇతరుని యన్నము, వేతున్ = వేచియుందును, (కోరియుందును) అభ్యధికంబు = పెద్దది, పుణ్యహీనుఁడై = పుణ్యములేనివాఁడవై, అనుజులు = తోఁబుట్టువులు, ఇందలి 'పుత్త్రిని సింధురాజుచేన్' అనునది ముందుపద్యముతో నన్వయించును.

14. బన్నము = కీడు, రాజసభలన్ = రాజులసభలందు, క్షత్త్రియవిదిత = రాజులచే తెలియఁబడినది, జాతుఁడు = పుట్టినవాఁడవు, హర్షావహుఁడు = సంతోషమును గలిగించువాఁడవు.

15. అనహంయుఁడు = అహంకారములేనివాఁడు, భరవాహుఁడు = భారము వహించినవాఁడవు, ఇందలి 'పరాజితుండవై' అనునది పైపద్యమున నన్వయించును.

16. కుజన = నరాధమా, మానహీన = అభిమానములేనివాఁడా, విందులు = బంధువులు, జడిన్ = జడిచేతనే, మూషికాంజలి = ఎలుకదోసిలి, సుపూరము = సులభముగా నింపఁదగినది, (ముందుపద్యమందలి 'అణుమాత్రమున నే' అనునది యిట సంధించుకొనఁదగును) అలఁతికిన్ = నీచునకు, హర్షము = సంతోషము, ఎసఁగన్ = కలుగును.

17. సర్పాశీర్హ్రాతిన్ = పాముకోఁబులాగుట, పరాక్రమింపుము = పరాక్రమము చూపింపుము, అప్రాణప్రకారంబుతోన్ = ప్రాణములేనివారిరీతిగా, అణఁగారన్ = డాఁగినచో, అరాతియనరు = శత్రువనరు, అస్తాప్తుండుగాక = పోయినమిత్త్రులు గలవాఁడుగాక.

18. పౌరుషము = పురుషయత్నము, విదితమొనర్చి = వెల్లడించి, విశ్రుతిన్ = ప్రఖ్యాతిని, నడ్మన్ = నడుమనుగాని, కడన్ = కడనుగాని, ఎన్నికన్ = గణనను, పొందదలంచకు = పొందఁగోరకుము, త్రుటిన్ = త్రుటికాలమైనను, కాలిచినతుమ్మికియట్ల = తుమ్మికి (తిందుకము) కొఱవివలె వెలుంగుము, మృదువు = మెత్తనివాఁడు, భీరువు, మేలుతేనికిన్, ఎవ్వనికిన్ = మంచిరాజునకెవనికిని, ఈఁగున్ = తీర్చుకొనును.

19. సిద్ధ్యము = సిద్ధింపఁదగినది, (రాఁదగినదని భావము) సిద్ధి = సిద్ధించినది (జరిగిపోయినది, అని భావము) జీవనతృష్ణ = బ్రదుకుమీఁదియాశ, ధర్మమును పురస్కరించి = ధర్మమును ముందునకుంచి, (ధర్మమును దూరముగాఁ బెట్టి అనిభావము) మననేలా = బ్రదుకనేల? సత్క్రియల్ = మంచిపనులు, అధృష్ట = దిట్టతనములేనివాఁడా, సుఖి = సుఖవంతుఁడు, మనికికిన్ = బ్రదుకుటకు (పైపద్యమందలి) ఫలమేమి = ఏమిలాభము కలదు.

20. 21, పాదమునన్ = (తన) కాలియందే (అనఁగా:—తనకాలిమీఁదనని భావము) పడుచుఁగా = వంగినిలిచి, కర్జము = చేయఁదగినది, మెప్పు = శ్లాఘ, రాశిపెనుపే = రాశినిపెంచుటకే (తగును) వానిన్, నెలఁతన్ = స్త్రీనిగాను, పురుషున్ = పురుషునిగాను, ఎన్నన్ = ఎంచుట, యుక్తంబు గాదు = తగదు, విద్యన్ = విద్యయందును, సత్యమ్మునన్ = సత్యమునందును, దానతపోర్థలాభములన్ = ఈవియందును, తపమునందును, ధనలాభము లందును, కీర్తిఁగనఁడేని, వాఁడు, తల్లికిన్, కాల్గడి = మూత్రమువంటి వాఁడు, శ్రీతపోమానుఁడె = ధనముచేతను, తపముచేతను గొప్పవాఁడే, పురుషుండు = పురుషుఁడనఁబడును, ఒవ్వనివారలు = సరిపడనివారలు, (శత్రువులు) విందు = బంధువు, సంజయుని తనదేశమునుండి అనిభావము. జనింపకుండుఁతన్, అనుదానికి పైపద్యములోని 'పడఁతికెవతికి' అను దానితో నన్వయము.

22. పొగయకుము = కుములకుము, ప్రజ్వలింపుము = మండుము, (శౌర్యముగల వాఁడవగుము) అణిమి = ఎదుర్కొని, అత్యల్పకాలమేని = మిక్కిలి కొంచెము సేపైనను, వైరుల తలవెలుఁగుము = శత్రువుల శిరసుపైని ప్రకాశింపుము, కలఁడు = కలవాఁడు.

23. సంతసంబందుటన్ = సంతుష్టిచేతను, సాకతానఁ = అనుగ్రహముచేతను, సిరిహాని = లక్ష్మినశించుట, ఉద్యమము = యత్నము, అనీహుఁడు = కోర్కెలులేనివాఁడు, సేవ్యుఁడు = సేవింపఁదగినవాఁడు, ఈమంగులఁ = ఈనీచులను, మ్రందఁజేయన్ = చంపుటకు, సహజంబగు, మదిఁ = మనసునందలి, మ్రదిమము = మృదుత్వము (మెత్తన) వీడుము.

24. సుందరివోలెన్ = స్త్రీవలె, దళితవిపక్షుండు = చీల్పఁబడిన శత్రువులు గలవాఁడు, (అయి) దివికేఁగినన్ = చచ్చినను, దేశవాసిమనుజులేన్ = తనదేశమందలి ప్రజలైనను, (తానుగాకున్నను) ఈపద్యమందలి 'వాస్తవ్యులకుఁ' అనుపాఠము సరిపడదు. క్రిందనిచ్చినపాఠాంతరమే న్యాయ్యము.

25. సుగము = సుఖము, గడియించినన్ = ఆర్జించినయెడల, దొరయవును = రాజగును, సంమోదనుఁడు = సంతోషపెట్టువాఁడు, అనన్ = అనివిదుల యనఁగా, తనయుఁడు = సంజయుఁడు, ననుఁగనవే = నన్నుఁజూచుకొను చుండుము, నేల = ధరణీరాజ్యమును, కలిమి = సంపదయును, తోడవు లుఁ = నగలును నీకేల?

26. తల్లిమాటలు—అందులోకములు = పొందులోకములు, అదృతాత్మల భువనములు = ఆదరింపఁబడిన లోకములు.

27. అసత్త్వులన్ = శక్తిలేనివారిని, పరాన్నోపజీవులన్ = పరులయన్నమును దిని బ్రదుకువారిని, పోలి = పోలినవాఁడనై, బ్రదుకకు, నిన్నున్ అనుసరించి, భూనిర్జరులు = విప్రులు, అమరులు = దేవతలు = మఘవున్ బోలెన్ = ఇంద్రునివలెను, భూతములు = ప్రాణులు, జలధరువలెన్ = మేఘునివలెను, (నిన్ననుసరించి) మందురుగాక = బ్రదుకుదురుగాక.

28. ఫలవృక్షమునుబోలె, ఏనరునిన్, వింతులన్, మోదపూర్ణులను = సంతోషముచే నిండినవారినిఁగా, ఎల్లరనుమించి 'హీనుఁడవీపట్టునన్' అనునది పైపద్యములోని కన్వయించును.

29. బీరము = వీర్యము, జీవితాశన్ = బ్రదుకుమీఁది యాశచే, పొడువని వానిన్ = శత్రువును జంపలేనివానిని, సద్వ్యవహారము = పండితులమాట, అనాయువు = ఆయువులేనివాఁడు.

30. చెలిమి = మైత్రి, బలహాని (సింధురాజు) బలనాశనము కొందలమున్న వారు = చలించుచున్నారు, ఉద్యమింతురు = పూనెదరు, అస్పందము = చలింపనిది, సార్థనామతన్ = చక్కనిజయముగలవాఁడనను వర్థముగలుగునట్లు, 'సంపాదింపుము' అను ముందుపద్యములోని క్రియతో నన్వయము.

31. జ్ఞానివృద్ధుఁడు, వృద్ధుఁడునగు నొక బ్రాహ్మణుఁడు అని మూలముననున్నది. కృచ్ఛ్రంబు = కష్టమును, హృష్టుల్ = సంతసించినవారు, ముందుపద్యములోని 'గాలుపైనన్' అనునది యీపద్యముతో నన్వయించును.

32. నయవర్తి = నీతి (మార్గమున) సంచరించువాఁడు, తేబరము = శూన్యము, భర్తృ + ఆత్మజ, హాత్యా; నెవ్వ = దుఃఖము, దీనికిన్ = దీనికంటెను.

33. అనర్ఘము = విలువలేనిది, కుటుంబినిన్ = కుటుంబముగలదానిని, అస్మత్త్యక్తలన్ = మాచే విడువబడినవారిని.

34. భార్యాన్వితున్ = భార్యతోకూడికొన్నవానిని నాహృదయసంతాపంబు = నామనోవ్యథను, క్షుద్రోత్తరమున్ = నీచమగు ఉత్తరమును, సేవ్యత్వంబె = సేవింప నర్హమగునదియే.

35. ఉసులు = ప్రాణము, తేప = తెప్ప, ఉక్కు = సారము.

36. పగఱను = శత్రువులను, తగవు = పాడి, అడఁపినన్ = చంపినచో, అసము = యశము, పేరువాఁడి = శౌర్యము, సన్నద్ధులన్ = కవచమును

దాల్చినవారిని, యశస్వి = కీర్తిగలవాఁడు, దక్షుఁడు = సమర్థుని, ఇందలి 'పడుము' అనుపదము ముందుపద్యముతో నన్వయించును.

37. చిచ్చులపిడుగు = నిప్పులువెలార్చుపిడుగు, అరులకున్ = శత్రువులకు, శమము = శాంతి.

38. ఈపద్యమందలి 'బ్రహ్మవినిర్మితంబు' అనునంద్యాఁకనున్న వాక్యము 37 లోని తృతీయాంతసమానపదమునకు విశేషణము. సాధ్వసపడక = భయపడక, కలుష కారులను = పాపముచేయువారిని, అయోమయము = ఇనుపది, నిర్దయము = దయలేనిది, ఆలమునకు = యుద్ధమునకు.

39. ఏకసుతవు = ఒక్కకొడుకేకలదానవు.

40. సాధ్యములు = సాధింపఁదగినవి, అఁగకున్నఁడు = నిరోధింపనియెడల.

41. ఖరివలెఁడు = ఆఁడుగాడిదవలె, నిష్కారణవత్సల = కారణములేని ప్రేమ గలది, సద్వృత్తుఁడవేని = మంచిప్రవర్తన గలవాఁడవేని, కూర్చెదను = ప్రియపడెదను, అసదాచారుని = మంచినడతలేనివానిని, ప్రజాఫలము = సంతానమువలని లాభము, విహితపరిత్యాగులు = విధియగువానిని వదలు కొనినవారు, అనికిఁడు = యుద్ధమునకు, జయి = జయముగలవాఁడవై, అని కాని జయమొందినసఖులతో అనికాని యన్వయము. దురాపము = పొంద నలవికానిది.

42. ప్రమదము = సంతోషము, సైంధవజయము = సింధురాజును గెలుచుట, కోశము = ధనము.

43. త్రిదివమునకుఁడు = స్వర్గమునకు, అఘి = పాపి. నాయట్టివానికిఁడు తెరువు = మార్గము.

44. విదులావాక్యము—తనుజా = కొడుకా! ధనము (కర్త) ఏఁచును = బాధించును, అదృశ్యము = చూడశక్యముకానిది, కినుకనే = కోపము చేతనే, కృత్యము = చేయఁదగినది.

45. అనిత్యము = ధ్రువముగానిది, అకర్తలు (పని) చేయనివారు, విఫలకృత్యుఁ డుఁడు = లాభములేని పనులుగలవాఁడును, వగవఁడు = విచారింపఁడు.

46. వగఁడోలి = విచారమునువిడిచి, పుడమివేలుపులను = విప్రులను, బలాఢ్య యుతుఁడు = బలవంతులతోఁ గూడియున్నవాఁడు, వేగఁడు, ఎసఁగుఁడు = వర్ధిల్లు.

జలజాప్తుఁడు = సూర్యుఁడు, క్రుద్ధులన్ = కోపించినవారిన్ = తొలఁగి నారిన్ = తొలఁగినవారిని, గర్వకలితులన్ = గర్వముతోఁ గూడినవారిని. గణములను = జనులగుంపులను, ప్రబుద్ధుఁడు = మేల్కొన్నవాఁడవు (జాగరూకుఁడవు),

49. అరిసహాయున్ = శత్రువులకు సాయపడువానిని సంభావ్యము = న్యాయ్యము.

50. పృథివీదయితుఁడు = రాజు, త్రస్తున్ = భయపడిన, దొరన్ = రాజును, గని, రాష్ట్రము = రాష్ట్రమందలి ప్రజ, దళము = సేన, భయాకులతన్ = భయముచేనగు కలఁతచే.

51. భూతికాములు = ఐశ్వర్యమును గోరువారు, రాష్ట్రాభిమానితన్ = రాష్ట్రమందలి యభిమానముతో, తేజము = శౌర్యము.

52. సాధువాదినిని = మంచిచెప్పువానిని, స్వమ్ము = స్వకీయమును, నెమ్మి = ప్రేమ.

53. భవిష్యత్ + బుద్ధి = రాఁగలకాలమందలి వృద్ధి (వృద్ధికి పర్యాయపదము) వేల్పులబోనమ్మును, బోని = అమృతమువంటి, తన్పు = తృప్తి, విపక్ష విహతిన్ = శత్రుసంహారమున.

54. వాక్శరక్షిప్తుఁడు = పలుకులను బాణములచేఁ దూల్పఁబడినవాఁడై, వాఁడు = సంజయుఁడు. ఫల్గుతి—మంత్రి, వైరిక్లిష్టున్ = శత్రువులచే క్లేశపెట్టఁబడిన, నృపతిన్ = రాజును, విన్పఁదగున్ = వినఁజేయవలయును, భయదము = (శత్రువులకు) భయమునిచ్చునది, తేజోవివర్ధనము = (తనకు) ప్రతాపమును వర్ధిల్లఁజేయునది, జిగీషువు = జయశీలుఁడు, క్షమ = భూమి, అశరీర = శరీరరహిత (యగువాణి) పురుడు = సమము, కలనన్ = యుద్ధమందు, కురుపుంగవులన్ = కురువంశజులను గెలువఁగలఁడు = జయించును.

